చ. గురు కరుణాకటాక్షమునకుం దగి నేర్చినయట్టిరీతి నేఁ
బరమతపోనిధానులును బ్రహ్మసమానులు నైన మీకు మీ
కరుణనుగోరి చెప్పితిని గాని ఘనుండ నటంచుఁ గాదు నే
నరుదుగఁబల్కు నీచరితమందునఁ దప్పులయేని సైఁపుఁడీ. ౧౫౨.

మ. అని వాక్రుచ్చిన రౌమహర్షణి మునుల్ హర్షంబునంగాంచి పెం
పునఁ బీతాంబర కుండలాదులిడి సంపూజించి పంపంగ నా
ఘనుఁ డత్యంత కుతూహల ప్రథితహృత్కంజాతుఁడై తీర్థపా
ధునిఁ జిత్తంబున నెంచుచుం జనియెఁ దోడ్తోఁ దీర్థయాత్రారతిన్. ౧౫౩.

క. స్కందపురాణాంతర్గత, మిందుకళాధరుఁడు గౌరి కెఱిఁగించిన యీ
చందముఁ జదివిన వినినన్, సందేహము లేదు సర్వసౌఖ్యములబ్బున్. ౧౫౪.

శా. గ్రావ్ణోర్వీభమృగాంకసంఖ్యశకమాగన్ మన్మథాబ్దంబునం
దావిశ్వేశ్వరుసత్కృపాప్తిశరదృత్వంతర్భవాష్ణాంబులం
దేవేళం బరికించి కృష్ణకవిరాజి కాశ్యపీ చక్రమం
దావిర్భావ్యముగాఁదగన్ సలిపె నౌరా! నాగనీ గ్రంథమున్. ౧౫౫.

## ఆశ్వాసాంతము.

మ. ప్రతిమాతీతవిసర్జనాంచితుఁడు సుబ్రాయుం డతండిచ్చు పెం
పుతగ న్నాకౌక మేల్కుటుంబభరణంబుం జేయఁగాఁ జాలు శా
శ్వతభూదానమొసంగి సత్కృతి నిదైశ్వర్యం బవార్యంబు గా
క్షితిఁ జేయింపఁగఁజేసి నీకొసఁగితిం జేకొమ్ము లోకేశ్వరా. ౧౫౬.

క. చందునకునూలుపోఁగను, చందంబున భక్తి నీకొసంగిన దీనిన్
డెందమున నెంచికొని పెం, పొందఁగ మముఁ బ్రోచియేలు మోహరమేశా. ౧౫౭.

మాలిని. నిరుపమగుణకోశా * నిత్యసత్యప్రకాశా
వరసురకలనాశా * వాసుదేవాద్యధీశా
పరిహృతభవపాశా * పాలితాశ్రీయదేశా
నరసహృదయవేశా * సర్వలోకేశ్వరేశా. ౧౫౮.

గద్యము. ఇది శ్రీమదఘనాతనూభయకవిమిత్ర, వేంకటయజ్వాగ్రపుత్త్రి, సమారాధిత విబుధరాజశ్రీపాద, కృష్ణమూర్తికవిరాజప్రణీతంబైన కావేరీచరిత్రంబను మహాపురాణంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

# పీఠిక.

"కీర్తికాంతా స్వయంవరము" అను చిన్నిపొత్తము, గోదావరీ మండలమునందలి నరసాపురము కడనున్న గుడిమెళ్లలంక గ్రామవాసులు శ్రీమాన్ ఇయ్యాణ్ణి అనంతపద్మనాభ దేశికాచార్యులవారు, రాజమహేంద్రవరమునందున్న మాకళాశాలా కార్యస్థానమునకు విచ్చేసి, పురాతనప్రబంధ పరిశోధనాయత్త చిత్తులమగు మాకగపఱచి, "ఈ గ్రంథరత్నమున్ మీకళాశాలావతీ కంఠాభరణంబుగాఁ జేసికొనుఁ"డని యొసంగిరి. మేమువందన పూర్వకముగాఁ గైకొని దీని నామూలాగ్రముగఁ బఠించి, ఇట్టిచక్కని గ్రంథము మనకళాపత్రిం బ్రచురించు భాగ్యంబు గలిగెఁగా యని పరమానందంబు బొంది యిట్లుపక్రమించితిమి.

ఇది మహీశూరపుర (మైసూర్) సంస్థానాధీశ్వరుండు శ్రీచామరాజాత్మజుండు శ్రీకృష్ణమహారాజాగారి పరమౌన్నత్యముం దెలుపు నుత్తమగ్రంథము. దీనిని దదాస్థాన కవీశ్వరులెవ్వరో రచియించియుండవచ్చును గాని గ్రంథకర్త నామమిందెచ్చటనుం గానరామి నిశ్చయించి వ్రాయుటకు వీలుపడదయ్యె. గద్యమునం జూడరాదా, యన నది మాకు లభించిన ప్రతిలో వ్రాయఁబడియుండలేదు. మేము మైసూరి గ్రంథవిషయమరయఁ గొందఱికి జాబులు వ్రాసితిమి కాని, కారణమేమో ప్రత్యుత్తర మొక్కరేనీయలేదు, గ్రంథతత్వమంతయుం దెలియునంతవఱకు ముద్రింపకూరకుందుమో యన గ్రంథస్వారస్యంబునం గల చాపలంబునం బ్రచోదితులమై వేగిరించితిమని వేరచెప్పికొనవలయునా?

ఇందలికథ మనోహరమైనది.—త్యాగుఁడను రాజునకు సాహసలక్ష్మియను భార్యకలదు వారిద్దఱు సంతానకాంక్ష హిమవంతంబునకుఁబోయి తపంబొనరించునపుడు గౌరిప్రత్యక్షంబై వరంబొసంగె. అంతవారికిఁ గొంతకాలంబునకుఁ గృపయుం గీర్తియునను నిర్వురు కొమార్తెలుపుట్టి దినదిన ప్రవర్ధమానలై యౌవన ప్రాదుర్భావసమయంబునఁ దండ్రియనుమతి స్వయంవరంబునం బెండ్లియాడందలంచి కూడినరాజలోకంబులో లోకంబులలేనితమ యేర్పాటులకొడంబడని యెల్లరాజులనొల్లక, మహీశూర పురీశ్వరుండగు చామరాజకృష్ణ భూపాలుని వరియించి వివాహముచేసికొనుట లోనగునది చక్కఁగవర్ణింపఁబడి యున్నయది.

శ్రీ

# కీర్తికాంతాస్వయంవరము.

శా. శ్రీమచ్చంద్రకళావతంస, త్రిజగత్సింహాసనాసీన తే
జోమూర్తిత్రితయాదికారణము, సంశుద్ధాత్మ, లోకైకసం
స్థానూలంబు, త్రయీస్వరూపిణియు నౌ చాముండికాదేవి, తాఁ
బ్రేమం బ్రోచుతఁ జామరాజతనయుం గృష్ణరాజాగ్రణిన్.

సీ. కంటికెత్తునకు మొక్కలిరక్కసులు కాపురంబున్న యూళ్లు పారంబోసంగి
కలజగంబులఁ గాల్పఁ గడఁగినచేదు నేరటిపాదుజోల్కఁ జెన్నుమిసంగి
జడలలోమినువాఁక చలువపాగామీఁద పాపజాబిలితురా పాదుకొలిపి
పాపయెమ్మెలకుఁ దోడ్పాటుగాఁ బెక్కండ్రు నలువలతలల పేరులను దాల్చి
మిత్తిఁదలమొత్తి సామేనసత్తి హత్తి
బుత్తిముత్తుల నీసిడంబెత్తినట్టి
గిత్తతత్తడిమేటిరాహుత్తు ప్రోచుఁ
గాతఁ గృతిపతి శ్రీకృష్ణభూతలేంద్రు.

చ. సిరి యెదఁ గుల్కఁ బాల్కడలి శేషునిపైఁ బవళించి వేదముల్
పరమమునుల్ సురల్ వొగడ భక్తులపాలిఁటి కొంగుమల్లెయై
పరఁగు సరోజనాభుఁడు కృపారసములుంచ్చాంశసంభవున్
సిరులనొసంగి ప్రోవుతఁ బ్రసిద్ధయశోనిధిఁ గృష్ణభూవరున్.

చ భువనములన్ సృజింపఁగను బ్రోవఁగఁ ద్రుంపఁగఁ జాలు హంసతా
ర్క్ష్యవృషభ రాజవాహులకు సాగిలి మ్రొక్కెడి సంస్కృతాంధ్రస
త్కవుల నుతించి కాకవులఁ గాదని యొక్క యపూర్వకావ్యముం
గవిజనచిత్తరంజకముగా నొనరించెద నేర్పు పెంపునన్.

తే. ఆర్యతోఁ గూడి యొక్క నాఁడష్టమూర్తి
రాజతాస్నగరంబుపై రత్నపీఠిఁ

ప్రమథగణములు శ్రుతులు తాపసులు సురలు
బలసి సేవింపఁగా నిందుకొలువుదీరె. ౫.

సీ. కాళీ శుభాసాంగ పాళీసుధాంబోధి కేళీవిహార సురాళి విభుఁడు
హాలాహలాభీల ఫాలాక్షి నిష్పన్న కీలావదిం ధనీకృతమదనుఁడు
సారంగధరకళా సారంగవరడింభ సారంగ ప్రతేయు చర్మధరుఁడు
స్వారాధనాగత స్వారాట్సరోజభూనారాయణాదినానామనుండు,
చారుమేరు శరాసనధారి త్రిపుర
హారి సాధుజనానందకారి భక్త
మానసవిహారి యామ్నాయ మార్గచారి
శంకరుఁడు నిందుకొలువున్న సమయమునను. ౬.

తే. తుహినగిరికన్య గౌరీవధూటి మగని
వదనకమలంబుపైఁ దననాలు చూపు
లళుల రీతినిముసరంగ నరసియిటులు
పలికెనంజలి యొనరించి భక్తిమీఱ. ౭.

ఉ. దేవ, మహానుభావ, జగతీత్రయనాథ, భుజంగభూష, గం
గాధర, చంద్రచూడ, శితికంఠ, యజాచ్యుత ముఖ్యదేవసం
సేవిత, కాలకాల, మృదుశీల, మహేశ్వర, ఫాలనేత్రభూ
పావక, దగ్ధదర్పక కృపాపర, శంకర, విష్ణువల్లభా. ౮.

తే. ఆదిమధ్యాంతశూన్య, దేవా, మూర్తి నిజ
సవసవగ వింటి మున్ను నా[illegible]
కీర్తికాంతాస్వయంకీర్తి సాగ
నెవ్వతెయొ? దానితలిదండ్రులెవ్వరొక్కొ? ౯.

క. ఎవ్వని వరియించెనోయా। జవ్వని, పూర్ణేందువదన, చంద్రివరాంగా,
యవ్విధము వినఁగ నామన। ముపొళ్ళులూగెడు ననుజ్ఞ యొసంగుమి నాకున్. ౧౦

వ. దేవా, తదుదంతంబు సవిశేషంబుగ నీవలన వినంగోరెద దెలుపవేయుని ప్రార్థించిన
నందిగంధర్వుం డమందానంద కందళిత హృదయారవిందుండై, గిరినందనం గాంచి
యిట్లనియె. ౧౧.

గీ. ఆలకింపుము శర్వాణి, యరుణపాణి,
ముక్తినిశ్రేణి, మకరందపూరవాణి,
సైకతశ్రోణి, సామగ్ర్యజానిరాణి,
తెలిపెదను నీకుసత్కథఁ దలిబడిగను ౧౨

వ. సావధానచిత్తమున నాకర్ణింపుమని యిట్లని చెప్పందొడంగె. ౧౩

చ. కలఁడొకరాజు, త్యాగుఁడనఁగా భువిఁబుట్టిననాటఁగోలెఁగే
వలముజనానురంజకత వర్ధిలి, లోకహిత ప్రవర్తన
న్నెలఁగుచు నెల్లరుం దనను మేలన, సాహసలక్ష్మి నాగను
త్పలదళనేత్ర, సత్కులజఁ బాణిగృహీతగఁ బ్రీతిఁ గైకొనెన్. ౧౪

ఉ. సాహసలక్ష్మి, త్యాగుకనుసన్న మెలంగుచు నిత్యపారతో
త్సాహముఁగల్గఁ జేయుచు, వశంవదగా నొనరించె, వారును
ద్వాహము నాటనుండి యెడఁబాయని కూర్మి రమింపుచుండిర
త్యాహిత పుత్రలాభకృతహర్షసముత్సుకమానసాబ్జులై. ౧౫

క. చిరకాలము త్యాగుండా । తరళాయత నయనతోడ దర్పక కేళీ
పరతంత్రత విహరించెను । సరసీరుహ పత్రనేత్ర, సంతతి లేమిన్. ౧౬

ఉ. సంతతిలేమి త్యాగుఁడును సాహసలక్ష్మియుఁ బెక్కువర్షముల్
చింతిలి, యేమి సేయుదమిసీ యనపత్యులమన్కి లోకత. జ
న్మాంతరమందునన్ జగన్మైతిమి పుత్రులుగల్గు భాగ్యమీ
వంతలఁగోరనేటికి, తపంబొనరింత మటంచు నెంతయున్. ౧౭

గీ. తలఁచి, సర్వస్వమగ్రజన్ములకు నొసఁగి,
తపము నొనరించి దాన సంతతినిఁ బడయు
కాంక్షను, తుషారగిరిప్రాంతఁ గానఁ గోనఁ
జేరి రాజదంపతులు శుభశీలురగుచు. ౧౮

చ. హిమగిరి చెంత, మున్ను జగదీశ్వరు శంకరుఁ గొండ్లియాడు డెం
దమునను శైలకన్యకవ్రతంబు లొనర్చిన యట్టి పావనా
శ్రమమును జేరి, త్యాగుఁడును సాహసలక్ష్మియు నిశ్చలాత్మతన్
దమమును శాంతిఁబూని, యతిదారుణమౌ తపమాచరింపఁగన్. ౧౯

క. వారలభాగ్యవశంబున । నారీమణి, గౌరియొక్క నాఁడు మగనిచేఁ
గూరిమి తలిదండ్రులఁగను । గోరికబోడముటను సెలవుఁగొనిపంపెంచెన్. ౨౦

క. జననీజనకులఁజూచెదు । మనమునశర్వాణి మంచుమలకుఁజెలులతోఁ
జనుదెంచియొక్కనాఁడా । వనమున విహరించువేడ్కఁ బరతెంచెఁదగన్. ౨౧

వ. వచ్చి, యయ్యాశ్రమంబు దరియంజేరి ౨౨

సీ. ఇదికదాతొల్లినే నీశ్వరారాధన సలిపినపావనాశ్రమతలంబు!
ఇవికదామనము మున్నీశుని పూజకై విరులుగోయుచునుండు వృక్షతతులు!
ఇవికదామనతోడ నెనసినర్తించిన చమరీగవయకృష్ణసారకములు!
ఇదికదా త్రిషవణం బేనాచరించెదు నములమైనట్టి పద్మాకరంబు',
ఇదికదా యీశ్వరుండు నాయెడనుకరుణ
నించి సాక్షాత్కరించిన నెలవటంచుఁ,
జెలిమికత్తెలతోడుతఁ జెప్పికొనుచు,
వచ్చెఁ బద్మాకరముఁ జేరవారిజాక్షి- ౨౩

క. చనుదెంచి, యందుమజ్జన, మొనరించెడు సాహసాఖ్య నుత్పలగంధిన్
గని, విస్మిత మానసయై, కనికరమున నిటులు శైలకన్యక బలికెన్ ౨౪

ఉ. ఎవ్వతెవీవు సారసదళేక్షణ, దారుణమైన కానలో
నివ్విధినొంటిఁ గ్రుమ్మరెద వేటికి? నెయ్యఁపుటల్కఁ బూనియో
పువ్విలుకానిఁ బాయురతి పోలికఁదోఁచెద వేమిగోరియో
జవ్వని, యవ్వనింతపము సల్పెదు నిక్కము దెల్పు, నాపుడున్- ౨౫

సీ. సాహసలక్ష్మి యాచందాననదన సేమమారయు చున్నయా యార్యఁగాంచి
తనమది లోకమాతగనెంచి, భక్తివినమ్రయై, సాఁగివందన మొనర్చి
హర్షగద్గదిక నిట్లనియె నంజలియొగ్గి, తల్లి, నీకరుణ నేధన్యనైతి
జగదీశ్వరిని నీవు సాక్షాత్కరించుట ఫలియించె నాదు తపంబు నేఁడు-
త్యాగుఁడను రాజునకుఁ గళత్రంబ నేను
దంపతుల మనపత్యతఁ దపము సేయు
చున్న వారము దేవి, యీ యుగ్రవనినిఁ
దపము సిద్ధించె మేలుచేఁ దవిలెమాకు!- ౨౬

ఉ- ఇంకఁదపంబు చాలుజగదీశ్వరి, నిన్నుఁగనంగఁగల్గెని
శ్శంకఁద్వదీయ పాదపరిచర్య యొనర్చుచునుండు నంచునా
పంకరుహాక్షి గౌరి పదపద్మములంబడి సంప్రహృష్టరో
మాంకురయై, ప్రమోదనయనాంబువులం గడిగెం దదంఘ్రులన్, ౨౭

వ. మఱియుఁబునః పునః ప్రణామంబులాచరించుచు, దేవీ, నీవాదిమధ్యాంత శూన్యవు, పరంజ్యోతిస్వరూపిణివి, ఆదిశక్తివి, చరాచరాత్మకం బగులోకం బశేషంబునీవలన సృజింపంబడి, నీచేరక్షింపంబడుచు నీయందె లయంబందు. సృష్టిస్థితి సంహార కర్తలగుత్రిమూర్తులకు మూలకారణంబవు, చండముండ సంహారిణీ, చాముండీ, చండికా, హైమవతీ, దాక్షాయణీ, కాళీ, శివాది నానానామరూపంబులం బ్రవర్తిల్లుచు, విహరింపుచుందువు. నాపుణ్య విశేషంబున నన్ను ధన్యంజేయుతలంపున నిచ్చటికి విచ్చేసితివని, కరకమలంబులు మొగిడ్చి, నిలిచియున్న సమయంబున. ౨౮

గీ. ఆర్య, కనుఁగొంచి, యాసాహసాఖ్యఁజూచి,
తపముసాలించి, పొందుమీ తావుఁజేర
మెచ్చితిని నీదుభక్తికి, మేలుగల్గు
నింకమీకని పల్కి యదృశ్యయయ్యె. ౨౯

ఉ. ఆగతిగౌరిచేవరము నందిన సాహసలక్ష్మినాథునిం
ద్యాగునిఁ జేరవచ్చి, ప్రమదంబునసాంజలియై, వినీతయై
సాఁగిలిమ్రొక్కి, పార్వతి యొసంగినయట్టి వరంబుఁ దెల్పినన్
రాగముమీఱఁగాఁ దనపురంబున కాతఁడుజాయతోఁజనెన్. ౩౦

గీ. తపవశంబున సాహసశ్రీకినంత
మాలునిలిచెను ద్యాగభూపాలుఁడలర
నెలలుతొమ్మిదినిండ నన్నీరజాక్షి
పూఁబులను గాంచె నిరువురగోర్క్కఁదీర. ౩౧

సీ. అనుకంపయు నెడు కన్యకవారిలోఁబెద్ద, వరగుణరూప లావణ్యశీల
నవనీతమునుఁ జేసె నాధాతఁయదియొగా దాపాదమస్తకం బమృతమయమొ
యునజగత్ప్రసిద్ధయైయొప్పె రెండవకూఁతురుకీర్తి నానామయు మిగిలెఁ
దనుకాంతిచిత్తముక్తాహార శారదాతారకా రోచియై తల్లిదండ్రు

ల్లములఁ బొంగనంత నాయుత్పలాక్షు
లొయ్యనొయ్యన శైశవంబుజ్జగించి,
నెమ్మియౌవనదశ, తమ్ముఁనిక్కి చూడ,
వృద్ధిఁబొందిరి బాలేందు రేఖలట్లు. 3౨

ఉ. శైశవముజ్జగించి యల చంద్రముఖుల్ నవయౌవనామృత
ప్రాశనఁ జేసినంతఁగను పట్టైను శిబ్బెము మేనులం, గళా
వేశముఁగల్గె మోములఁ, నవీనవిలాసము జగ్గునిగ్గుల
భ్యాశముఁబేరెఁ జూపరుల కద్భుతమావహిలంగనద్యుదక్. 33

చ. కనలదొకప్పుడుక్, విరసగా దొకనాఁటికి నేని, ధూర్తవ
ర్తనమనరాదు, పల్కులసుధారస ముప్పతిలంగఁబల్కుఁ, జూ
పునవ్వెడఁ జల్లుఁజేరిమ, వినఁబోదు దురుక్తుల, బీదసాదలక్
గనిన వహించుజాలి, యనుకంప, గుణంబులకుప్ప యేమనక్. 3౪

సీ. ఆటలాడెదనన్న నవనీతలంబెంత, చౌకళింతు నటన్న జలధులెంత,
కప్పళించెదనన్నఁగుల భూధరములెంత, పఱచెదనన్న భూవలయమెంత,
శోధించె దనటన్న సురవిష్టపంబెంత, నిక్కిచూతునటన్న నింగియెంత,
అరసెదనన్న బ్రహ్మాండ భాండంబెంత, తిరిగివచ్చెదనన్న దిక్కులెంత,
యనుచు యౌవన కృతగర్వ మతిశయిల్లఁ
దన్నువరియించు రాజగోత్రాత్రితలమున
లేడటంచును, నెవ్వారి లెక్కగొనక,
నమరెనత్తఱిఁగీర్తి కన్యాలలామ. 3౫

వ. ఇట్లుదినదిన ప్రవర్ధమాన యౌవనలై, పెండిలికిం బట్టులైయున్న యనుకంపాకీర్తిసం
జ్ఞలందనకూఁతులంగాంచి, త్యాగమహీనాథుండు, తనునగణాభి జన్యసౌందర్య చాతు
ర్యలావణ్యాతిశయులగు రాచకొమరుల నేర్పతింపంజాలక స్వయంవరమహోత్స
వంబు చాటించిన, నానాదేశంబులనుండి రాజకుమారులు పఱతెంచి, పురంబు
నపడిసిరంత. 3౬

సీ. త్యాగుండు పుత్రీస్వయంవరార్థంబుగా బఱతెంచినట్టి భూపాలసుతుల
సత్కారమొనరించి, శయనాసనాన్న పానాదులఁ దృప్తుల నాచరించి,

నగుటవీనికి నొప్పిదంబైనరాజ
నందనుని సేవరింతు నానందముగను. ౪౨
వ. అదియునుంగాక. ౪౩
చ. ననువరియించినట్టి నృపనందనుగాని వరింపదన్యునీ
వనజదళాక్షి సాధ్విమృగనాభమదగ్రజ సౌమ్యశీల వ
ర్తన యెడఁబాటు నైఁప దపరాధము సేయదు మేలు గూడుచు
న్మనమునొసంగు దీనినను మానముమాని వరింపఁగాఁదగున్. ౪౪
చ. కనలినఁ జేరరోయు, ననుకంపయ టందురు దీనిపేరు పె
ల్చనఁబరుషోక్తుల న్వినఁగ నైఁపదలంతిగఁ జూడరాదు చం
దనముమనంబు, పల్కులు సుధారసపూరము లిన్నిలంతనే
వనితవరించినట్టి నరపాలునిఁగాని వరింప నేనొరుల్. ౪౫
తే. మనసునమెలంగు నిదియిట్టిమగువ పెండ్లి
యాడు రాజన్యుఁడే మాన్యుఁడగును జగతి
మఱియుఁ దెలిపెద నింకొక్క మాటగలదు
వినుఁడుఁ రాజన్యులార, నావిన్నపంబు. ౪౬
చ. కరగతుఁగాఁగఁ జేసి కొనఁగాఁదగు మజ్జనకుం బ్రివృద్ధుఁడ
త్పరిహృతిఁ జేయరాదు పరివాదమొనర్పఁగఁగూడ దాతనిం
గరుణను బ్రోవఁగాఁదగును గానియెడం ద్యజియింతు నేను సు
స్థిరమతి నిత్యమాతనిఁ ద్యజింపనివాని భజించుచుండెదన్. ౪౭
తే. అదియె సాహస లక్ష్మిమాయంబ సర్వ
కృత్యములఁ దోడుపాటొనరింపఁగలది
సంపదకుమూలమీమె నాజనకుఁడొక్క
నిముసమెడబాసిన సహింపలేఁడగుట. ౪౮
తే. వీడఁగారాదు వీరల విసువరాదు
అలఁతిచూపులఁ జూడరా దలుగరాదు
ననువరించిన రాజన్యునకును మాన్య
లైనవీరల పోషణంబర్హమగును. ౪౯
క. నాయంబసేని మత్తిస్థా, నాయగ్రజసేని విడిన నాజనకుండా
చాయను నిలువఁడు వెంటనె, పాయుదుఁ గాయంబు నేను బార్థివులారా. ౫౦
వ. అగుట నిన్నింటికి నొడంబడిన రాజన్యుఁడు సూరమూర్ధన్యుండు నన్నుఁ వరియించు

గాతమని కీర్తికాంతావతంసంబు పలికి మిన్నకుండెనంత. ౫౧

ఉ. పండిలిగాక మున్నెయిటు ప్రేలెదుభూపతు లింతలేసివా
రుండగలజ్జ వీడ్వడి దురుక్తుల నీజగజంతసేలుజా
ణండిపుడున్న రాజకమునంగను పట్టదు పొండటంచునా
క్కండు నృపాలసూనుఁడలుకన్ సరిరాజులతోడఁ బల్కెఁదాన్. ౫౨

వ. మఱియును. ౫౩

సీ. గయ్యాళి దీనితోఁగాదు కాపురమని మేదినీశుఁడొకండు మిన్నకుండె
జగములం దల్లాడుజాయ యేటికటంచు నవనీశుఁడొకఁడు మాటాడకుండె
బాలికాంతమగును సాహసలక్ష్మి పాత్రనిధారు ణీశ్వరుఁ డొక్కఁడూరకుండె
నీత్యాగు భరియింప నెవ్వఁడోపు నటంచు నెకిమీఁడొకండునో రెత్తకుండె,
నిందటేకినన్న వస్త్రము లిచ్చిధనము
పదడు గాఁజేసికొను పెండ్లిఫలముచాలు
చాలువేలదని యొక్కభూపాలుఁ డుండెఁ
గానివరియింతు ననువాఁడుగా నరాఁడు. ౫౪

చ. వినివిననట్లొకండు, కడుబేదురు జెందినయట్లొకండు, నా
ప్పనిగనియొక్కఁడీ వెడఁగుపల్కుల కేమనియొక్కఁడిట్లు ల
జ్జను మొగమోడ జేసి తనచాయఁ గనుంగొన కున్న రాజులం
గనుగొనికీర్తికాంతయలు కంగడకం బలికెన్ సభాస్థలిన్. ౫౫

తే. అకటా! మమ్ములవరియించు నట్టివాఁడు
గలుగఁడాయెనె యీరాజకంబులోన
మెలఁగవలసె ననాథతె నిలనుమాకు
ననుచు నిట్టూర్పు నించియిట్లనియె మఱియు. ౫౬

తే. పౌరుషం బుజ్జగించి యీధారుణీశు
లూరకుండిరి గాని యిందొక్కఁడేని
మగఁటిమివహించి మామీఁద మనసుపెట్టఁ
డాయె నిర్వీర్యమయ్యెఁ బో యవనితలము. ౫౭

ఉ. పౌరుషహీనులైతలలుపట్టుక పల్కఁగ లేక మిన్నకు
న్నారిట వీరుపేదుక గనంజను డెంచిరకాని పెండ్లికై
రారిటువంటి పంచలకు రాఁబని యేమి స్వయంవరార్థమే
తీరుననిండ్లకేగుదురొ యీ దీనతలన్వహియించి మేముల౯. ౫౮

ఆ. అతనిధర్మపత్నియైన సాధ్వీమణి
కొంపసంజమాంబ యింపుమిగుల
జగతియదుకులంబు బొగడికకెక్కఁగాఁ
గృష్ణుఁబోలెఁగనియెఁ గృష్ణరాజు. ౬౪

సీ. ఏరాజునిరుపమోదారప్రతాపంబు వేసవిరవికిని వేడిచూపు
నేమండలేశుదాతృత్వవైశేష్యంబు శిబికర్ణబలులను సిగ్గుపఱచు
నేమహామహుని నిస్సీమయశోవళక్షత పండువెన్నెలఁ గడకుఁదఱుము
నేపార్థివేంద్రుని రూపవిలాసంబు తలిరుదూపులజోదు తప్పులెన్ను
నతఁడు వీరప్రతాప రాజాధిరాజ
రాజపరమేశ బిరుదవిరాజమాను
లైన రాజన్యులకు గండఁడనఁగఁబరఁగుఁ
జామరాజసుతుండు గృష్ణనృపవరుఁడు. ౬౫

సీ. కరుణారసంబొల్కఁగాఁ బల్కునేకాని పౌరుషం చెప్పాటఁబలుకఁబోఁడు
ఉపకారమునకుఁ దానుత్సహించునెకాని కలనైన నపకృతిదలఁపఁబోఁడు
ఇచ్చుచో నెంతైన నిచ్చుమాటయెకాని యింతయిచ్చితినంచు నెంచఁబోఁడు
పరులెచ్చుగానున్నఁ బ్రమదమొందునెకాని యొకనికల్మికి నీసునొందఁబోఁడు
వినయసౌజన్యధైర్య వివేకశౌర్య
సరసతౌదార్య గాంభీర్య చతురతాది
భావుకగుణంబులకు నాటపట్టుచామ
రాజతనయుండు శ్రీకృష్ణరాజమౌళి. ౬౬

చ. యదువులరాజ్యపాలన కనర్హులఁజేయు యయాతిశాప మ
య్యదుకులమందుఁబుట్టియు సమర్థుఁడనయ్యెను మాన్యనైతి న
య్యదననటంచుఁ గృష్ణుఁడు మహాత్ముఁడు చామమహీశు పుత్త్రుఁడై
యదుకులమందుఁ గృష్ణుఁడను నాఖ్యజనించి ధరిత్రియేలెఁదాన్. ౬౭

వ. మఱియును,

సీ. కడగండ్లఁబడి గతిఁగనఁజాలవంచునాశాసామజముల నేస్తంబురోసి
యడుగంటిచేరఁబోముడుచు మొగంబని కమఠేంద్రు మీఁదిరాగంబువదలి
వారెత్తినను విషజ్వాలలువిని గుడ్డుకనిచెవుడని ఫణీంద్రువెడఁబాసి
నిలిచినచో శైల్లఁగలచి దుర్మ్మార్తునంచని ఘోణిమీఁది మోహంబువిడిచి
పృథివితనయరతఁజామరాజేంద్ర తనయుఁ

కృతసకలసాధు సంత్రాణుఁ గాంపనంజ
మాంబికాగర్భ శుక్తిముక్తాయమానుఁ
కృష్ణరాజ మహీంద్రు వరించి చేరె. ౨౯

సీ. కులగోత్రముల పెంపుదలఁపక మున్నిటు నుద్ధరించినమేటి నుజ్జగించి
సార్వభౌమ పేరును సంబంధముడిగి మహాభోగిభోగ సౌఖ్యంబు రోసి
తలమోచికొనియుండు ధవునికన్నడ జేసి యంజఁగొల్చినవాఁడు నాసగడపి
యదువంశవార్ధి రాకామృతదీధితి రాజన్యకోటీర రత్నకషణ
సంభవపరాగ శబలిత చరణపీఠు
రాజకంఠీరవుని కృష్ణరాజచంద్రు
వలచి చేరినయట్టి పంటలవలంతి
కెక్కుడే తక్కువారలపై నెరగింత. ౩౦

సీ. అరదంబు కృంగిచేవరియున్న తఱి వైరి సమయఁజేసిన ధనంజయుఁడు దీటె
ప్రతినచెల్లింప నేరక సంగరమున శిష్యునకు లొంగిన భృగుజుండు దీటె
యదలించి దాయపై నడచ వెన్కకొకింత జరిగిన జానకీజాని దీటె
మించె నాయపకీర్తి యంచుఁ దామాఱువేషమునఁ బోరిన మహేశ్వరుఁడు దీటె
శాత్రవుఁడు పోరఁ గదసిన సాహసాధ
నముల మఱచెడు భానునందనుఁడు దీటె
మొక్కపోవని యుక్కుపెంపెక్కు రాజు
రాజహంవీరుఁ డగు కృష్ణరాజునకును. ౩౧

సీ. స్వకృత దానార్జిత స్వర్ణనిపకాధ మస్తదమ్రుతాంక్షో రాజరాజరాజు
స్వోపాత్త చాప విద్యాపాండితీ పూర్ణధబ శిష్య సద్గుణ భార్గవుండు
స్వపరిభావఖ్యాపక పరిజాననిరీక్షణ వివర్జిత రిపుస్తోభుజుండు
స్వయశోభిమర్శన స్వవదాతపాథోధి జననహేతు శ్వేతవనజవైరి
స్వాప్రతిమదోః పరితాపాశ్రయాశచటుల
హేతివిద్యోతఖద్యోత దినుఁడు చామ
రాజతనయుండు శ్రీకృష్ణరాజమౌళి
ధర్మమును భూమి నాల్గుపాదములనిలిపె. ౩౨

సీ. ఆపద్గతవసుంధరాపాలురే తెంచఁ గోరి మిఁదనయంత వారిఁజేయు
సామాన్యయాచక జనసమూహమునకు లక్షలొసంగియు లజ్జఁజెందు
నపరాధము నరించినట్టి వాఁడైన రానేరంబు లెన్నక గారవించు

వ. అక్కటకటా! యతిభారంబులైన కిరీటాంగదాది భూషణంబులు దాల్చిన వీరు వే
షధారులుగా నోపుదురు, కానిరాజకుమారులుగా నోపరు, వంశంబులు చెఱుపం
బుట్టిరి నిక్కంబుగా వీరు రాజన్యకుమారులే? ని స్వయంవరంబున మావంటి సత్కులాం
గనామణుల నహమహమికల వరియింపకుందురే! ఇట్టివారల మహీపతులుగాం బుట్టిం
చినవిరించి నేమనందగునట్లగుటం జేసి యేకదా! సస్యగర్భుండు పూజార్హుండుగాం
డయ్యె. అనిపలికి నలుగడలు గలయంగనుంగొనుచు నారాజలోకంబునకుం దూలంగి
ప్రత్యేకంబ సింహాసనాసీనుండైయున్న యొక్క భూపాలనందనుం గాంచెనంత. ౪౭

క. పలుమరుం దనవంకం గని । జిలిబిలి నగవాననమునం జెన్నలరంగ మీ
సలుగోట దీటుభూవర । తిలకుంగని కీర్తికాంత దలఁపి వహింపన్. ౪౮

తే. చూచితలయూఁచి యీలోకసుందరుండె
మమ్మువరియించునని యనుమానములను
దోఁచుచున్నది మిన్నక చూచునీతఁ
డేలొకో? యనిమదిసంశయించుచుండె. ౪౯

వ. ఆనృపాల నందనుండు. ౫౦

సీ. దుర్మదావనిపాలశర్మదాంతఃపురహాసజీవాతజంఘానిలుండు
కడులేమిఁజెంది దిక్కుడలి కుందెడువారి కడగండ్ల దయఁబాయఁగొట్టఁబోవు
ముష్కరాభీరతురుష్కయావనముఖ్య వీరకాంతాగర్భగంభీరపేట
కోదమజవ్వనపుటామొదవి పొక్కుడు బోంట్లయుల్లంపు శోకంబుముల్లవిడుపు
సకలరాజన్య మూర్ధన్య మకుటనికర
ఖచిత రుచిర ప్రచురరుచినిచయనూత్న
రత్నదీప్తి ప్రదీప నీరాజితాంఘ్రి
సారసుండింపు మీఱును జామరాజు. ౫౧

ఉ. ప్రాక్తనరాజులం గెలిచె భవ్యగుణంబున జామరాజధీ
శ్శక్తిని దేవభూమి దివిషద్గురుభక్తి, ప్రజానురంజనా
సక్తి, బుధానురక్తిని ససాధు విరక్తి యశోనుషక్తి, స
ద్వ్యక్తిని లోకసత్పథనియుక్తి సుధామయసూక్తి సంతతమున్. ౫౨

మ. పటుకావ్యారచనా చమత్కృతి గుణంబర్థింపఁగాఁ జాలు, ను
ద్భటబాహాబలశక్తి నవ్వడముడిన్ ధట్టింపఁగాఁజాలు, ను
త్కటతేజోగరిమ సహస్రకిరణుం దర్జింపఁగాఁజాలు, ని
ప్పటి రాజన్యులఁ జామరాజు సరిచెప్పన్ వచ్చునే యెవ్వరిన్. ౫౩

చ. అటువలెఁ గృష్ణభూమిపతి యత్యనుకంపను గీర్తికాంత న
త్యుత్కటమగు ప్రీతిఁ గైకొని యుదారగుణాంబుధి విప్రకోటికిన్
సంకటు గాఁ యకాళితె ధనంబు నమేయముగా నొసంగి యం
తటు శిబిరంబుఁ జేరి తన ధామముఁ జేరఁగ నేగె సేనతోన్. ౯౭

సీ. కటతట స్రోత దుత్కటదానగంధానుబంధాను యాయి పుష్పంధయములు
ఉత్క్షిప్త తుండా సముద్వాంత వమథు నివారితార్యమ సైంధవ వ్రజములు
ధరిణానుకారమారుదప్రియ పరస్పర సాతిస్ఫుటిత బర్హాముఖ పుస్తకములు
సాంత్రిక్యకర్కశ స్కంధసంఘట్టన మసృణితాంభోవాహ మండలములు
బృంహితాపూర్ణకుహర దరీముఖములు
సాన్వసధ్వాన దీర్ఘదిశా వ్రజములు
భద్రమంద్రముఖానేకవంశజములు
నడిచె సేనాంగకములు కృష్ణనృపు మ్రోల. ౯౮

ఉ. అంబభవాద్రినాథుని ఫణావళి గ్రుంగగ మ్రోలనశ్వముల్
మండలచంక్రమంబులు సమంజసలీల నొనర్చు వేళలం
జండఖురాంచల క్షతిర సాస్థలి నవ్రియ్యలు వారని రట
న్నిండి సముద్రమయ్యె నవనీవలయంబును జుట్టువారగన్. ౯౯

చ. నడి నెడమన్ శతాంగములకుం బగతిన్వడి మండలాకృతిన్
నడువఁగ దిచ్చుచుంటుఁగని నాఁడు మొదల్ రవితేరు నట్లసే
నడపఁగఁ గోరియత్నము మొనర్చుచునుండెనె కాని నేరఁడ
న్నడకలె పక్షిణోదగయనంబులుఁ గాగను పట్టునిప్పుడున్. ౧౦౦

సీ. అము నేనుగులు పోరాడుచో నిరుగేలదుండముల్ గానివాని దుడుదువాన్ప
శార్దూలములు రెండు సరిపోర నెడసొచ్చి బాహుపోట్ల నెజము సాలికనుప
సైనిభంబుల రెంటి సరగ కొమ్ములు పట్టి తాకుఖాడించి చీకాకు జేయ
గిరిపై కెలంఘించు కంఠీరవము నాగి యసియాడమి గడాప్రిటునటిగట్టెఁ
జగువమగటిమి నేనుపు దిట్టతనము
సాముసాధనములును దోశ్శక్తి గరిమ
గలుగువీరభటుల్ రిపూత్కరము బెదర
నడిచిరప్పుడు కృష్ణభూనాథు మ్రోల. ౧౦౧

ఉ. ఆరజపుష్పిటాయులయయాఁరమటుండగ నిమ్ము గోటిసిం
గార మొకింత తారలమఁగల్గునె మోముని గార మిందునం

సారయ మంగమార్దవమయారె శిరీషసుమంబటంచు న
న్మారుఁడు మెచ్చుకోఁదగిన మంజులమూర్తులు వేశ్యలప్పు డిం
పారఁగఁ గ్రీవలన్నడచి రన్నరనాథవరేణ్యు మోసలన్. ౧౦౨

సీ. ననుఁ గడగంటఁ గన్గొనె నేని నవనిధులిత్తునంచు గుబేరుఁ డెదురుచూడ
ముచ్చటించినఁ జాలు ముల్లోకములయేలుబడియిత్తునని శచీపతి మెలంగ
నాటపాటల పరీక్షార్థంబు బిలుతురో యనుచు రంభాదులంతంతనీగ
తుంబురునారదాదులు విపంచ్యాది వాద్యములు మోయుచు వెంటనంటినడువ
సొలపు హొయలు విలాసంబు సోయగంబు
కులుకు తళుకును జగ్గు నిగ్గు గరువంబు
చూపులన చుట్టిపడ మహీశూరపురికి
నడిచె వేశ్యాజనంబు కృష్ణనృపుమ్రోల. ౧౦౩

వ. ఇట్లు మహావైభవంబున నప్పురంబు జేరి సుఖంబుండె నని పలికి మహేశ్వరుండు జా
యంగాంచి యో ముద్దుగుమ్మా, యిదికీర్తికాంతా స్వయంవరోదంతంబు తెలుంగునీకు
తెలిగించితినని మిన్నకున్న మిన్నేటిజడదాల్పు మన్ననిం జూచి సర్వమంగళ యిట్ల
నియె. ౧౦౪

క. నాచరము చేజనించిన, పావనకన్యకల కేలువట్టిన యాభూ
మీంద్రుని యింటనిలువం, గానలె మనకనుచు శైలకన్యక పలికెన్. ౧౦౫

ఆ. ఆవిధమున గౌరి యభవునోడంబడ
నాడి భర్తఁ గూడి హర్షమునను
ధన్యమైన కృష్ణపార్థివేంద్రునివీట
నధివసించి పూజలందుచుండె. ౧౦౬

క. పరమేశ్వరుండు గౌరియుఁ
బరతెంచిన పొంతై సిరియుఁ బద్మాక్షుండా
ధరణీధవువీట వసించిరి,
పరమానందప్రపూర్ణచేతను లగుచున్. ౧౦౭

సీ. అరగరాజకన్యక మ్రొక్కనాఁటి వేకువ వేళ నల్లనిత్రాసయుశంఖ
చక్రాంకుశములు పాశముతర్జనము గదియంబు శూలంబు కరాబ్జకమున
నలరారఁ గోటిమార్తాండతేజంబుచే దిశలు వెలుంగఁగ దివ్యభూష
ణములు దాల్చి మోమునందిరునవ్వు వెన్నెలగాయఁ గన్నుల నెనరువాలుక
నమరకామినుల్ముడిగళ్ళులా పరింప

మూర్తి మంతంబులై వేదములు నుతింప
సింహవాహన మెక్కి విచ్చేసినాదు
స్వప్నమునందో చె బుణ్యావశంబువలన. ౧౦౮

ఉ. ఏనుబిరానలేచి జగదీశ్వరికిం బ్రణమిల్లిభక్తి చే
నానతమూర్తి నై భయముహర్షము నచ్చెరుపాటు వేడ్కయుజ్
మానసమందుదట్టి కొంకమాటయు బల్కగ వేగమూగచం
నానసుదక్షత నూభవగాంచి యిట్లనెజ్, ౧౦౯

తే. వత్స, నీపూర్వపుణ్యంబు వలననీకు
దర్శనంబిచ్చితినినిన్ను ధన్యుఁజేయ
నేనుజగదీశ్వరిని మదభీష్టమెుకఁడు
దెలిపెదనునీకు నీవదిదీర్చవలయు. ౧౧౦

క. కలఁడు మహీశూరపురా
జ్వలరాజ్యరమావిభుండు చామమహీభృ
త్తిలకునిపుత్త్రుఁడుమద్వర
ఫలమలఘుయశుండు కృష్ణపార్థివుఁడనఘా. ౧౧౧

గీ. అతనికెనిగీర్తి కాంతకు నైనపెండ్లి
తెలుఁగుగావ్యంబొనర్పుము తెలుఁగుభాష
ననుచు నిక్కథ తెల్పగల్గ నాజ్ఞయొసఁగి
దేవి లోకైకమాత యదృశ్యయయ్యె. ౧౧౨

తే. అంతమేలుగాంచి యక్కలయార్యుల
కెఱుకపఱుప వారలిదిశుభంబు
గారిలోకమాఁత కరుణించెనీయెడ
దడయకామె యాజ్ఞనడుపుమనిరి. ౧౧౩

క, ఆపరమేశ్వరి యానతి
నాపార్థివునకును గీర్తికగుపెండిలిచా
ప్పొపినయట్లు రచించితి
శ్రీపరమేశ్వరికిఁ బ్రీతిఁ జేసెదుగోర్కెజ్. ౧౧౪

తే. కీర్తికన్యాస్వయంవర కీర్తనంబు, వినినఁ జదివిన వ్రాసిన మనుజులకును
ఆపదవాలంగు సకలసౌఖ్యంబులమరు, సంపదలుగల్గు వంశంబుసాఁగుచుండు. ౧౧౫

చ. యదుకులసార్వభౌమ, వదనాపహృతద్యుతిసోమ, పల్లవ
ప్రదరశతాభిరామ, జనరక్షణరామ, గుణాబ్ధిసీమ, దు
ర్మదరిపుభీమ, సర్వజనరంజననామ, ఖరాంశుధామ, య
భ్యుదయపరంపరల్ గలుగుచుండుత మీకనుగృష్ణభూవరా. ౧౧౭

శా. సామంతక్షితిపాల సేవితపదాబ్జాతా, మహీశూరపూ
ర్ధామా, శ్రీవిజితేంద్రవైభవ భుజాదండోద్ధృతక్ష్మాతలా
చాముండాకరుణాఫలాయిత యదుక్ష్మాభృత్కులోత్తంస, ని
స్సీమప్రాభవ, చామరాజతనయా, శ్రీకృష్ణరాజాగ్రణీ. ౧౧౮

స్రగ్విణి. సర్వసర్వంసహా చక్రసంరక్షణా
ఖర్వభారోద్వహా కామినీకీరగం
ధర్వవీణాకళా నారదా సాహితీ
గీర్వధూటీవరా కృష్ణరాజాగ్రిణీ. ౧౧౯

గద్యము ... ... ... ... ... ...

సమాప్తము

రాజమహేంద్రవరము — కళావతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

